కూతుళ్లూ వున్నారు. వారితో తగూలూ - పోట్లాటలూ వస్తాయి. అతని కుటుంబంలో కల్లోలం చెలరేగుతుంది. మీకు కూడా శాంతి వుండదు. మీరు ఈ సంగతు లన్నీ ఆలోచించారా?"

అనూరాధ వినయంగా "ఆలోచించాను. అలాంటి వేమీ జరగ వని నా నమ్మకం" అన్నది.

విని విజయుడు స్తంభించిపోయాడు. "వృద్ధుడు ఎంత కాలం జీవిస్తా డని ఆశిస్తున్నారు?" అన్నాడు.

"లోకంలో ప్రతిఆడదీ భర్తఆయుస్సు వృద్ధికావాలని కోరుకుంటూ వుంటుంది. ముత్తైదున్నై నేనే ముందు చనిపోవచ్చుగా" అన్నది అనూరాధ.

విజయుడు ఎంత వెతికినా దీనికి సమాధానం దొరకక స్తబ్ధుడై నిలబడి పోయాడు. కొంచెం సేపున్నతర్వాత వినయంగా "నన్ను వెళ్లిపొమ్మని చెప్పిన తర్వాత మళ్లా ఏనాడూ ఆప్రసంగం తీసుకురాని మాట యథార్థమే. నేను దయాపాత్రురాలను కాకపోయినా దయ తలిచారు. దానికి మనసులో ఎంత కృతజ్ఞత చూపెడుతున్నానో చెప్పలేను" అన్నది.

విజయుని వైపునుండి ఏమీ సమాధానం రాకపోయేప్పటికి "మిమ్మున్ని గురించి ఎవరిదగ్గర నైనా ఎక్కడైనా చెడుగా చెప్పానో లేదో భగవంతుడికి తెలియాలి. గంగూలీ మహాశయుడు ఏదైనా చెబుతే అవి అతనివి కాని, నావి కాదు. అయినా నేను అతని తరఫున క్షమాపణ కోరుకుంటున్నాను" అన్నది మళ్లా అనూరాధ.

"మీ వివాహ మెప్పుడు? జ్యేష్ఠ బహుళత్రయోదశికా?

అయితే షుమారు ఒక నెలరోజులు వుంది కదూ?" అన్నాడు విజయుడు.

"అవును."

"దీనిలో మార్చేది ఏమీ లేనట్టేగా?"

"బహుశా వుండదు. అతను అలాంటి ఆశపెట్టే పోయాడు."

విజయుడు చాలసేపటివరకు మెదలకుండా వూరుకొని "అయితే నేను చెప్పేది ఇంకేం లేదు. కాని మీ భావిజీవితాన్ని గురించి కూడా మీరు కించిత్తైనా ఆలోచించనందుకు నాకు చాల విచారంగా వుంది".

"ఒక్కసారి కాదు, వెయ్యిసార్లు ఆలోచించి చూచాను. రాత్రింబగళ్లు ఇదే నా ఆలోచన. మీరు నామేలు కోరేవారు. మీకు కృతజ్ఞత తెలపటానికి నావద్ద తగినంత భాష లేదు. కాని మీరు స్వయంగా కూడా నన్నుగురించి సమగ్రంగా ఆలోచించి చూడండి—ధనం లేదు - రూపం లేదు - ఇల్లు లేదు - వాకిలి లేదు. ఒంటరి జీవితంలో వచ్చే వూరి అత్యాచారాలను, అనాచారాల నుండి తప్పించుకు తిరగటానికి ఎక్కడా కాస్త స్థానమైనా లేదు. ఇరవైమూడు, ఇరవైనాలు గేళ్ల వయసు వచ్చింది. అతను తప్ప నన్ను వివాహం చేసుకోటానికి ఇంకెవరు ఇచ్ఛగిస్తారో మీరే చెప్పండి? పట్టెడు మెతుకుల కోసం ఎవరిముందుకు వెళ్లి దేవురించుతూ తిరగను? విని మీ రేమనుకుంటారు మనసులో" అన్నది అనూరాధ.

ఆ సంగతు లన్నీ నిజమే. కా దనటానికికూడా సందు లేదు. రెండు మూడు నిమిషాలు మెదలకుండా నుంచుని

విజయుడు మహానుతాపంతో "అలాంటి సమయంలో నేను మీ కేమీ వుపకారం చేయలేనా? చేయగలిగితే చాల సంతోషిస్తాను" అన్నాడు.

"మీరు నాకు మరొక రెవరు చేయలేనంత వుపకారం చేశారు. మీ పంచను నేను నిర్భయంగా వున్నాను. బిడ్డలిద్దరూ – నాకు సూర్యచంద్రులు – నాకు అదే చాలు. అన్న నేరంలో నన్నుకూడా భాగస్వామినిగా ఎంచవద్దని నా ప్రార్థన. నేను బుద్ధిపూర్వకంగా చేసిన నేర మేమీ లేదు" అన్నది అనూరాధ.

"అది నాకు తెలుసు, మీరు చెప్ప నవసరం లేదు" అని విజయుడు మెల్లగా బైటికి వెళ్ళి పోయాడు.



కలకత్తానుండి కూరలూ నారలూ – పండ్లూ ఫలాలూ వచ్చాయి. విజయుడు తట్ట వంటింటిముందు దింపించి "లోపల వుంటారు చూడు..." అన్నాడు.

లోపలనుండి మృదుస్వరంతో "వున్నాను" అని సమాధానం వచ్చింది.

"మిమ్మల్ని పిలవటం కూడా చాలా ఇబ్బందిగానే వుంది. మా సమాజంలో అయితే మిస్ చటర్జీ అనో, మిస్ అనూరాధ అనే పిలిచేవాళ్లము. కాని ఇక్కడ అలాంటి వేమీ సాగవు. పిల్లలైనా ఎవరైనా వుంటే– 'మీ పిన్నిని పిలవరా"అని వెళ్లమార్చుకో వచ్చును. కాని ఈ సమయంలో

వారుకూడా అంతులేదు. ఏమని పిలవమంటారో చెప్పండి?" అన్నాడు విజయుడు.

అనూరాధ వాకిటిదగ్గరకువచ్చి "మీరు యజమానులు! నన్ను 'రాధా' అని పిలవండి" అన్నది.

"పిలవటానికి ఏమీ ఇబ్బంది లేదు కాని – యజమానిననే అధికారబలంతో కాదు. అధికారం వుంది గగనచటర్జీ మీద – కాని అతను అంతులేదు. యజమాను లని మీ రనుకోటం దేనికి?" అన్నాడు విజయుడు.

"అలా అనకండి. మీరు యజమానులే" అని లోపల నుంచి సమాధానం వచ్చింది.

"దానిని గురించి నే నేమి గట్టిగా చెప్పలేను. కాని వయసులో మాత్రం మీకంటే చాల పెద్దవాణ్ణి. పేరున పిలచినా మీరు కోపగించుకోకండి" అన్నాడు విజయుడు.

"లేదు"

విజయుడు ఎంత పులుముకు తిరుగుదా మనుకున్నా ఆమె దూరదూరంగా వుండటం గ్రహించాడు. ఆమె ఎదుటకు కూడా వచ్చేది కాదు. చాటునుండే సమాధానా లిచ్చేది.

"ఇంటిదగ్గరనుంచి కూరగాయలూ, పళ్లూ వచ్చాయి. ఈ తట్ట లోపలపెట్టించి పిల్లలకు యివ్వండి" అన్నాడు విజయుడు.

"అక్కడ వుంచి వెళ్లండి. అవసరమైనంతవరకు అట్టిపెట్టుకొని తక్కినవి మీవద్దకు పంపుతాను."

"వద్దు. అలా చెయ్యకండి. మావంటవాడికి సరిగా చెయ్యటం కూడా చాతకాదు. ప్రొద్దుటినుంచి దుప్పటి ముసుగు

పెట్టుకొని పడివున్నాడు. మలేరియా పట్టుకుందో యేమో?"
ఇక జబ్బుపడ్డా డంటే నా యెముకలు తినేస్తాడు."

"మావూళ్లో మలేరియా లేదే. అతను లేవకపోతే
మీకు వంట ఎవరు చేస్తారు?"

"ఈపూటకు పరవాలేదు. రేపు ప్రొద్దున ఆలోచించుకో
వచ్చును. వెంట కుక్కరు ఎలాగూ వుంది. ఏమీ లేకపోతే
నౌకరుచేత దానిమీద వండించుకుంటా" అన్నాడు విజయుడు.

"కాని, చాల యాతన పడాల్సి వస్తుంది".

"యాతనేమీ లేదు. నాకు అలవాటై పోయింది. కాని
బిడ్డ పడే యాతనలు చూస్తే కష్టంగానే వుంటుంది. కాని
ఇక్కడ ఆభారం మీరు వహించారు. ఈ పూట ఏమి వండు
తున్నారు. తట్టతీసి చూడండి. ఏమైనా పనికివస్తాయేమో."

"పనికివస్తాయి కాని నేను ఈపూట వంటచెయ్యను".

"ఎందుకని?"

"కుమార్ వళ్లు కొంచెము వెచ్చగా వుంది. వంట చేస్తే
అతను తింటానని మారాం చేస్తాడు. సంతోష్ ప్రొద్దున మిగిలిన
అన్నం తింటుంది."

"వళ్లు వెచ్చగా వుందా యేమిటి? ఏడి?"

"నా పక్కమీద పడుకుని సంతోష్‌తో కబుర్లు చెబు
తున్నాడు. ఇవ్వాళ బైటికి వెళ్లను, నీ దగ్గరే పండుకుంటాను,
అంటున్నాడు."

"పండుకుంటే పండుకో నియ్యండి. కాని ఎక్కువ
గారాబాన మాత్రం పెట్టకండి. మళ్లీ పిన్నిని వదలిపెట్టి కదల

నంటాడు. తర్వాత చాల చిక్కున పడవలసివస్తుంది'' అన్నాడు విజయుడు.

ఏమీ పడనవసరం లేదు. కుమార్ చెబితే వినని బిడ్డేమీ కాదు''.

"ఏమి వింటాడో ఏమో? మిమ్ముల్ని కూడా చాలా యాతన పెడుతున్నా డని విన్నాను'' అన్నాడు విజయుడు.

అనూరాధ కొంచెంసేపు మెదలకుండా వుంది. "వేధించితే న న్నొక్కదాన్నే వేధిస్తాడు. ఇం కెవరినీ వేధించడు'' అన్నది.

"అది నాకూ తెలుసు. పినతల్లి సహిస్తే సహించ వచ్చును గాని సవతితల్లి సహిస్తుందా? ఏనాటికైనా సవతితల్లి వస్తే సాకటం కష్టం. అలవాటు పడితే వాడికీ నష్టమే'' అన్నాడు విజయుడు.

"బిడ్డకు నష్టం కలిగించే సవతితల్లిని మీరు ఇంటికి తీసుకురావటం మాత్రం ఎందుకు? మంచిది కాదు''.

"తీసుకురా నవసరంలేదు. కాని కుర్రవాడి దురదృష్టం పండితే సవతితల్లి దానంత టదే వస్తుంది. ఆ నష్టాన్ని నిరోధించ టానికి పినతల్లిని శరణుజొచ్చవలసి వస్తుంది'' అన్నాడు విజయుడు.

"తల్లిలేని బిడ్డను పినతల్లి వదలిపెట్టలేదు. ఎన్నికష్ట నిష్ఠురాలకు లోనైనా వాణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేస్తుంది.'' అన్నది అనూరాధ. సరే, చూస్తాను–'' అని విజయుడు వెళ్ల బోతూ మళ్లీ తిరిగివచ్చి "అవినయమును క్షమించితే ఒక్క సంగతి'' అన్నాడు.

"అడగండి."

వాడితండ్రి బ్రతికున్నాడు గనుక – కుమార్‌ను గురించి తర్వాత ఆలోచించవచ్చు. అతను మీ రనుకున్నంత అనాధ కాడు. కాని సంతోష్? ఆమె తల్లిదండ్రు లిద్దరు లేరు. పిన తండ్రి త్రిలోచనుని ఇంటిస్థానం లేకపోతే ఆమె ఏ మౌతుందో:- దాన్ని గురించి ఏమైనా ఆలోచించారా?"

"అక్కకు స్థాన ముండి చెల్లెలికి వుండదూ?" అన్నది అనూరాధ.

"వుండవలసిందే, కాని నేను అతన్ని చూచినంత వరకు – అతన్ని ఎక్కువ ఆశపెట్టుకున్నా లాభం లేదనిపిస్తూ వుంది".

ఈ మాటకు సమాధానం అనూరాధ వెంటనే యివ్వలేక పోయింది. ఆలోచించటానికి కొంతసేపు పట్టింది. "అయితే చెట్లకిందైనా ఇద్దరికీ స్థానం దొరుకుతుంది; అక్కడెవరూ కాదనలేరు–" శాంతస్వరంలో కాని దృఢంగా.

"పిన్నికి తగ్గమాటే. దాన్నెమీ కాదనలేము; కాని అది అసంభవము. అయితే ఆమెను మా యింటికి పంపిం చండి. కుమార్‌కు స్నేహితుడుగా కుమార్ మనిషైతే అతనూ అవుతాడు" అన్నాడు విజయుడు.

లోపలినుంచి మళ్ళీ ఏ సమాధానమూ రాలేదు. విజ యుడు కొంచెంసేపు ఎదురుచూచి బైటకు వచ్చాడు.

రెండు మూడు గంటలైన తర్వాత సంతోష్ వచ్చి తలుపు బైట నుంచుని "అక్కాయి మిమ్ముల్ని భోజనానికి పిలుస్తూవుంది" అన్నది.

"నన్నా?" విజయుడు అడిగాడు.

"అవును" అని వెళ్లిపోయింది.

అనూరాధ వంటింట్లో పీటవేసి వుంచింది. విజయుడు పీటమీద కూర్చుని "రాత్రి చాల హాయిగా వుంది. మీ రింత యాతన పడిం దెందుకు?" అన్నాడు.

అనూరాధ దగ్గరే నుంచుని వుంది. మాట్లాడలేదు.

వడ్డించిన పదార్థాల్లో విశేష మేమీ లేదు. ఎంతో చక్కగా వడ్డించారు. భోజనంచేస్తూ "కుమార్ ఏంతిన్నాడు?" అన్నాడు విజయుడు.

"సగ్గునీళ్ళు త్రాగి పండుకున్నాడు"

"ఇవ్వాళ తగూ లాడలేదూ?"

అనూరాధ నవ్వి "నా దగ్గిర పండుకుంటాడుకాదూ, ఇవ్వాళ చాల శాంతంగా వున్నాడు. ఏమీ మారాం చెయ్యలేదు" అన్నది.

"వాడిమూలంగా మీ యాతన ఎక్కువ అయింది. కాని దీనిలో నా తప్పేమీ లేదు. వా డంతట వాడే మెదలకుండా మీఇంట్లో ఎలాకలిసిపోయాడా అని ఆలోచిస్తున్నాను."

"నేనూ అదే ఆలోచిస్తున్నాను"

అనూరాధ మొదట మెదలకుండా వూరుకుంది. "మీరు ఇంటికితీసుకెళ్లేముందు మీ ఒకమాట యిచ్చిపోవాలి. మీ రతనికి ఎటువంటి కష్టమూ రాకుండా చూస్తూ వుండాలి" అన్నది మళ్ళా.

"నేను పుట్టెడు వ్యవహారాల్లో మునిగి అటూ ఇటూ తిరుగుతూ వుంటాను. మీ మాట నిలబెడతా నని నమ్మకం కలగటం లేదు."

"అయితే అతన్ని నా దగ్గిరే వదలిపెట్టి వెళ్లాలి."

"మీరు చాలపొరపడుతున్నారు. ఇది మరీఅసంభవం" అని విజయుడు నవ్వుతూ మళ్లీ భోజనం చెయ్యసాగాడు. తింటూనే మధ్యలో "వదినా వాళ్ళూ వస్తారని చెప్పాను. బహుశా వారు ఇక రా రేమో" అన్నాడు.

"ఎందుకని?"

"వస్తా మన్న వుద్దేశం మారి వుంటుంది. పట్టణవాసులు ఒకపట్టున పల్లెలో అడుగుపెట్టటానికి ఇష్టపడరు. ఒకవిధంగా మంచిదే అయింది. నే నొక్కణ్ణే మిమ్మల్ని చాల యాతన పెడుతున్నాను. వారు కూడా వస్తే ఇంకా యాతనగా వుంటుంది."

ఈ మాటకు అనూరాధ అడ్డుతగులుతూ "మీరు అలా అనకండి. ఇల్లు నాది కాదు; మీ దయినా చోటంతా నేనే ఆక్రమించుకు కూర్చున్నాను. వారొస్తే యాతన పడతానా? అంతకన్న అన్యాయ ముంటుందా? నన్ను గురించి అలా భావించి నిజంగా మీరు అన్యాయం చేస్తున్నారు. మీరు నాయందు చూపిన కనికరానికి నేను చేసే ప్రతిఫలము ఇదేనా?" అన్నది.

ఇన్నిమాటలు ఈ విధంగా ఆమె ఎప్పుడూ మాట్లాడ లేదు. సమాధానం విని విజయుడు స్తంభించిపోయాడు. ఈ పల్లెటూరి పిల్ల అత నను కున్నంత అశిక్షితురాలుకాదు. కొంచెం సేపు నిశ్శబ్దంగా వుండి తన తప్పిదాన్ని వప్పుకుంటూ "నిజంగా నేను ఇలా అనటం వుచితం కాదు. ఇది వుచిత మను కునే వారికంటే మీరు పెద్దవారు. సరే! రెండు మూడు రోజు

లలో నేను ఇంటికి వెళతాను. ఇక్కడికి వచ్చిన మొదట్లో నేను మీతో చాలా మొరటుగా వ్యవహరించాను. కాని అది మిమ్ములను ఎరుగకుండా జరిగింది. నిజంగా లోకంలో తరుచుగా అలా జరుగుతూనే వుంటుంది. అయితే వెళ్లేముందు నేను చాల సిగ్గుతో మిమ్మల్ని క్షమాపణ కోరుకుంటున్నాను'' అన్నాడు.

అనూరాధ మృదుస్వరంతో "క్షమించను'' అన్నది.

"క్షమించరా? ఎందుకని?''

"మీ రింతవరకు చేసిన అత్యాచారాలకు క్షమాపణ లేదు'' అని ఆమె నవ్వింది. దీపపువెలుగులో ఆమె నవ్వు మొహము విజయుని కంటపడింది. క్షణంసేపు ఏదో అపరిచిత ఆశ్చర్యంతో అతని హృదయ మంతా కదలిపోయి స్థిరపడింది. క్షణంసేపు మెదలకుండా వుండి, "ఇదే మంచిది! నన్ను క్షమించ నవసరంలేదు. అపరాధిగా వుంటే నే నెప్పుడూ జ్ఞాపకముంటాను'' అన్నాడు.

రెండుమూడు నిమిషాలవరకు ఇద్దరూ మౌనంగా వూరుకున్నారు.

అనూరాధే మౌనభంగం చేసి "మీరు మళ్లా ఎప్పుడు వస్తారు?''

"అప్పుడప్పుడు వస్తూనే వుంటాను. కాని మీరు కనపడటానికి వీలుండ దేమో.''

రెండవనైపున దీనికి ప్రతివాదన రాక పోయేప్పటికి విషయం యథార్థమే నని తెలుసుకున్నాడు. భోజనమైన తర్వాత విజయుడు బైటకి వెళ్లబోతూవుండేప్పటికి "తట్టలో

కూరగాయలు చాలా వున్నాయి. మీ సువారంలోకి పంపను. రేపు ప్రొద్దున కూడా మీరు - ఇక్కడికే రండి భోజనానికి" అన్నది అనూరాధ.

"తథాస్తు! ఇతరులకన్న నాకు ఆకలి కొంచెం ఎక్కువని తెలిసిపోయిం దనుకుంటాను. లేకపోతే - ఒక్కపొద్దున్నే ఏమిటి - విందుకాలం ఇంకా పొడిగించ మని - నేను ఇక్కడ వున్నంతకాలం మీ చేతిభోజనమే తిని ఇంటికి వెళ్లేలా ప్రస్తావించేవాణ్ణి".

"అది నా అదృష్టం" అని సమాధానం వచ్చింది.

ఆ తర్వాత మూడురోజులకు బదులు ఐదురోజులు గడచిపోయినాయి. కుమార్ కి బాగా ఆరోగ్యం వచ్చింది. ఈ కొద్ది రోజుల విందులో ఏమీ లోటున్నట్లు కనపడ లేదు. విజయునికి ఆమె పరిచయం కూడా అంతకన్న గాఢం కాలేదు. వసారాలో పీటలువేసి అనూరాధ అన్నం చల్లారబెడుతూ వుంటుంది. సంతోష్ వడ్డించుతూ వుంటుంది. కుమార్ వచ్చి 'చేపలకూర అంతా వదలిపెట్టకుండా తినాలంటోంది నాన్నా' అనేవాడు. 'నాన్నగారు రాక్షసేమీ కాదని మీ పిన్నితో చెప్పు' అనేవాడు విజయుడు. కుమార్ మళ్లా వచ్చి 'కూర వుంటే వుందిలే, నిన్నటిలాగ గిన్నెలోపాలు గిన్నెలోనే వుంటే ఆమెకు చాల దుఃఖం కలుగుతుంది' అనేవాడు. విజయుడు విని 'నిన్నలాగ చెంబుకు బదులు పాలు గిన్నెతో యిస్తే వుండవు అని చెప్పు' అనేవాడు.

౬

ఈ విధంగా ఈ అయిదురోజులూ గడచిపోయింది. స్త్రీల ఆదరసత్కారాల చిత్రం విజయుని మనసులో ఎప్పుడూ స్పష్టంగా లేదు. చిన్నప్పటినుంచీ తల్లి అసమర్థురాలుగా కనపడుతూ వుండేది. ఇల్లాలి కర్తవ్యం ఆమె ఎప్పుడూ పూర్తి చేయలేక పోయేది. అతని భార్యకూడా రెండు రెండున్నర సంవత్సరాలే జీవించివుంది. అప్పుడు అతను చదువుతున్నాడు- ఆతర్వాత అతని జీవితం దీర్ఘప్రవాసంలోనే గడచిపోయింది. అతనికి అప్పుడప్పుడు అనేక తన జీవిత అనుభవాలు జ్ఞప్తికి వస్తూ వుంటాయి. కాని అవన్నీ పుస్తకాల్లో చదివే కల్పనా కథల్లాగ అస్వాభావికంగా తోచేవి. జీవిలోని వాస్తవికావసరాలతో అతని కేమీ సంబంధం లేదు.

ఇక వదిన ప్రభామయి వున్నది. ఆమె పెత్తనం చేస్తున్న కుటుంబంలో మంచి చెడ్డల విచక్షణ జరుగుతూ వుండేది. ఆ కుటుంబం అతనికి తనదిగా తోచేదిగాదు. అనేక సార్లు తల్లి ఏడుస్తూ వుండటం చూచాడు. తండ్రి కోపంతోనూ, వుదాసీనతతోనూ వుండటం గ్రహించాడు. కాని ఈ విషయాలన్నీ అతనికి అసందర్భముగా, అనధికారచర్చగా తోచేవి. పెత్తండ్రి భార్య తన మరది మంచిచెడ్డలు కనుక్కోకుండా వున్నా, కోడలు అత్తమామలకు సేవచేయకపోయినా అతనికి మహాపరాధంగా లోచేదికాదు. తన భార్యకూడా అలా చేయడం చూస్తే అతనికి బాధ కలుగుతుందని లేదు. ఈ అయిదురోజుల్లో అతని ఈ ధోరణి అంతా శిథిలమై పోయింది. ఇవ్వాళ సాయంత్రం బండికి అతడు కలకత్తా వెళ్ల

వలసివుంది. నౌకర్లు సామానంతా మూటకట్టి సిద్ధం చేస్తు న్నారు. ఇక కొద్ది గంటలే వుంది. ఇంతలో సంతోష్ వచ్చి "అక్కాయ్ భోజనానికి పిలుస్తూ వుంది" అన్నది.

"ఇప్పుడా ?"

"అవును" అని సంతోష్ అక్కడినుంచి వెళ్లిపోయింది.

విజయుడు లోపలకు వెళ్లి చూచాడు. వసారాలో పీటవేసి భోజనానికి సిద్ధంచేసివుంది. కుమార్ పిన్ని మెడ పట్టుకుని వ్రేలాడుతున్నాడు. అతన్ని చేత్తో వదిలించుకొని అనూరాధ వంటింట్లోకి వెళ్లింది.

పీటమీద కూర్చుని విజయుడు "ఈవేళప్పుడు ఇదేమిటి" అన్నాడు.

"కాస్త పులగం చేశాను. భోంచేసి వెళ్లండి" అన్నది అనూరాధ.

సమాధానం ఇవ్వటానికి విజయుడు ఇవ్వాళ కొంచెం గొంతు సవరించుకోవలసి వచ్చింది. "ఇంతయాతనపడి ఇన్ని చేసింది ఎందుకు? నాలుగు పూరీలు చేస్తే చాలకపోయిందా?" అన్నాడు.

"పూరీలు మీరు తినరుగా. ఇంటికి చేరేప్పటికి రాత్రి రెండుగంట లౌతుంది. తినకుండా వెళ్లినా నేను తక్కువబాధ పడేదాన్నా ? బిడ్డ తిండీ తిప్పలూ తినకుండా పడివుంటాడు కాబోలు – అని జ్ఞాపక మొచ్చేది."

విజయుడు మెదలకుండా భోంచేస్తున్నాడు. "వినోదకు చెప్పేశాను. అతను మీ మంచిచెడ్డలు చూస్తూవుంటాడు.

మీరు ఈ ఇంట్లో వున్నంతకాలం మీ కేలాంటి కష్టమూ వుండదు'' అన్నాడు మళ్లా.

మళ్లా అతను కొంచెం సేపు మెదలకుండా వుండి "ఇంకొక మాట చెప్పిపోతున్నాను. ఎప్పుడైనా గగనుడు వస్తే- నేను అతన్ని క్షమించా నని చెప్పండి. కాని అతను ఇక ఈవూళ్లోకి రావ ద్దనండి! వస్తే క్షమించను'' అన్నాడు.

"ఎప్పుడైనా వస్తే చెబుతాను'' అని అనూరాధ మెదల కుండా వూరుకుంది. మళ్లా క్షణంసేపు వుండి'' కుమార్ ని కొట్ట కండి! ఇవ్వాళ అతనికి వెళ్లటానికి ఏమీ ఇష్టంలేదు''.

"వెళ్లటానికి ఎందుకు ఇష్టంలేదో అదీ చెప్పడు''అన్నది.

"వాడికే తెలియంది ఏమి చెబుతాడు. మనసులో అక్కడికి వెళితే కష్టంగా వుంటుం దనికూడా అనుకుంటాడు'' అన్నాడు విజయుడు.

"ఎందుకు కష్టంగా వుంటుందీ ?''

"ఆ యింటి ఆచారమది. కష్టా లున్నా వాడు ఇంత పెద్దవాడయింది అక్కడేగా.''

"అయితే అతన్ని తీసుకెళ్లకండి. ఇక్కడ నావద్దే వుండనీయండి ''

విజయుడు నవ్వుతూ "నా ఆటంక మేమీ లేదు. కాని ఒక నెలరోజులకంటె ఎక్కువ వుండ లేడు. దానివల్ల లాభం?'' అన్నాడు.

ఇద్దరూ మౌనంగా వుండిపోయారు. "ఇతని సవతితల్లి వస్తుం దని విన్నాను. చదువుకున్న దట'' అన్నది అనూరాధ.

"అవును, బి. ఏ. పాసయింది.''

"బి. ఏ. వీడి పెత్తల్లి కూడా ప్యాసయిందిగా?"

"పాసయింది. కాని బి. ఏ. ప్యాసు చేయించే పుస్తకాల్లో మరదిని ఆదరించ మన్న విషయం రాయలేదు. ఈవిషయంలో ఆమె పరీక్ష యివ్వ నవసరం లేక పోయింది.

"రోగగ్రస్తులైన అత్తమామలు? ఆ విషయంకూడా పుస్తకాల్లో రాసి లేదా?"

"లేదు. ఈ ప్రస్తావన మరీ హాస్యాస్పదం."

"హాస్యాస్పదం కాని విషయ మేమైనా వుందా?"

"వుంది. ఏ విధమైన ఫిర్యాదు చేయకుండా వుండటమే మనసంఘంలో సురక్షితమైన పద్ధతి."

అనూరాధ క్షణంసేపు మెదలకుండా వుండి "ఆ పద్ధతి మీలోనే వుండనియ్యండి. బిడ్డను బి. ఏ. పరీక్ష మించినది కాదన్నది అందరికీ ఒకవిధమైన పద్ధతే. అలాంటి ఆడదాన్ని చేసుకోటమే పొరపాటు" అన్నది.

"ఎవరో ఒకరు చేసుకోక తప్పదుగా! మనముండే సమాజవాతావరణాలలో బి. ఏ. ప్యాసయే గౌరవంకూడా దక్కదు. సంసారమూ నడవదు. తలిదండ్రులు లేని చెల్లెలి బిడ్డను చెట్టుకింద వుండ నిష్టపడే ఇల్లాలితో మనం వనవాసం చేయగలముగాని సమాజంలో వుండలేము."

అనూరాధ స్వరము క్షణంసేపు తీవ్రమైంది. "వద్దు అలా చేయవద్దు. మీరు ఇతన్ని ఏ నిర్దయ విమాతకూ అప్ప జెప్పవద్దు" అన్నది.

"ఆ భయ మేమీలేదు. అప్పగించినా కుమార్ చేతి నుంచి జారి కిందపడతాడు. అంటే దాని అర్థం ఆమె, నిర్దయు

రాలనికాదు. నాభావిపత్ని తరఫున నేను మీమాటను తీవ్రంగా ఖండిస్తున్నాను. ఈ నేరం ఆమెమీద పెట్టకండి" అన్నాడు విజయుడు.

అనూరాధ నవ్వి "మీరెంతైనా ఖండించండి. హడిలి పోయిన ఆత్మీయత అంటే ఏమిటో కొంచెం చెప్పండి"అన్నది.

"అది మా పెద్ద సర్కిల్ సంసారబంధం. దాని 'కోడ్' వేరు. మొహంకూడా ప్రత్యేకం. దాని వేళ్లు నీరు పీల్చవు. ఆ నీటిరంగు కూడా పచ్చదనం రాకుండా పసుపురంగువస్తుంది. మీరు పల్లెటూరి గృహస్థుల ఇంటిబిడ్డలు. స్కూళ్లూ కాలేజీలలో చదివి ప్యాసవలేదు. టీపార్టీ – బాణసంచాలలో పాల్గొనలేదు. వాటిని గూఢరహస్యాన్ని మీరు చెప్పలేదు. కాని కుమార్ కి నచ్చే సవతితల్లి హాడికి విషమూ పెట్టదు, కొరడా చేతపట్టుకొని వెంటాడదు. ఆమె మార్జితరుచికి విరుద్ధాచరణ గలది. అందుచేత ఈ విషయంలో మీరు నిశ్చింతగా వుండండి" అన్నాడు విజయుడు.

"నేను ఆమె సంగతి వదలిపెడతాను. కాని మీరు స్వయంగా చూస్తూ ఉంటూ నని మాట ఇవ్వండి. నేను ఇదే విన్నవించేది" అన్నది అనూరాధ.

"మాట ఇవ్వాలనిపించుతున్నది గాని నాస్వభావము, పద్ధతి, అలవాటు లోకంలో వేరుగా ఉంటవి. మీ మాటను మనసులో పెట్టుకుని అప్పుడప్పుడూ చూస్తూ వుంటానికి ప్రయత్నిస్తాను. కాని మీరు చెప్పినంత జరగ దని అనుకుంటున్నాను. సరే, భోజనమైంది. ఇక వెళతాను. ప్రయాణానికి సిద్ధం కావాలి" అన్నాడు విజయుడు.

అని అతను లేచి నుంచుని "కుమార్ మీవద్దే వుంటాడు! ఇల్లు వదలి వెళ్లేరోజున వినోదునివెంట కలకత్తా పంపండి. అవసరమనుకుంటే వాడివెంట ఏమీ సంకోచపడ కుండా సంతోష్‌ను కూడా పంపండి. మొదట్లో మీతో వ్యవ హరించి నటువంటిది కాదు నాస్వభావము. వెళుతూ మా ఇంటివద్ద – కుమార్‌ను మించిన అనాదరం సంతోష్‌కి జరగ దని ఆశపెట్టి పోతున్నాను" అన్నాడు.

*　　　*　　　*

ఇంటిముందు గుర్రపుబండి నిలబడివుంది. సామా నదీ వేశారు. విజయుడు బండియెక్క బోతూవున్నాడు. ఇంతలో కుమార్ వచ్చి "నిన్ను పిన్ని పిలుస్తూవుంది నాన్నా?" అని చెప్పాడు.

అనూరాధ తలవాకిటివద్ద నుంచుని వుంది. "నమస్కారం చెయ్యటానికి పిలవ మన్నాను. మళ్లా ఎప్పుడు చేయగలు గుతానో ఏమో!" అని ఆమె వంగి నమస్కారం చేసింది. మళ్లా నుంచుని కుమార్‌ని తనవళ్లోకి తీసుకొని "నన్ను గురించి విచారపడవద్దు. పిన్నిదగ్గరవున్నంతవరకు ఎలాంటిఅనాదరమూ జరగ దని నాన్నగారికి చెప్పు బాబూ!" అన్నది.

విజయుడు నవ్వి "నమ్మడం కష్టం" అన్నాడు.

"కష్టం ఎందుకు ? మీకున్నాడానా ?" అని ఆమె నవ్వింది. ఇద్దరూ ఒకరిమొహాలు ఒకరు చూచుకొన్నారు. ఆమె కనురెప్పలు తడిగావున్నా యని విజయుడు స్పష్టంగా గ్రహించాడు. మళ్లా తలవంచుకొని "కుమార్‌ను తీసుకెళ్లి

బాధపెట్టకండి. చెప్పటానికి ఇక అవకాశముండదని మాటి మాటికి చెబుతున్నాను. మీ ఇంటిసంగతి జ్ఞప్తికి రాగానే అతన్ని పంపటానికి మనసొప్పటం లేదు.”

“అయితే పంపకండి!”

ఆమె మెదలకుండా వూరుకుంది.

“వెళ్లేముందు మళ్లీ ఒకసారి జ్ఞాపకం చేసిపోనా - ఎప్పుడు ఏ అవసరం వచ్చినా నాకు వుత్తరం రాస్తానని మాట యిచ్చారు” అన్నాడు విజయుడు.

“నాకు జ్ఞాపక ముంది. గంగూలీ మహాశయుని నేను ముష్టి దానీలా యాచించ వలసివస్తుంది. కించన పడుతూ అడగవలసి వస్తుంది. కాని మీవద్ద అదేమీ అవసరంలేదు. కావలసింది సంకోచం లేకుండానే అడగ గలనని నాకు తెలుసు.”

“సరే జ్ఞాపక ముంచుకోండి” అని విజయుడు బైలుదేర బోతూవుండేప్పటికి అనూరాధ “అయితే మీరుకూడా ఒక మాట యిచ్చి వెళ్లండి. అవసర మొచ్చినప్పుడు నాకుకూడా రాస్తూవుంటా నని” అన్నది.

“వ్రాయటానికి నాకేం అవసరం వస్తుంది అనూ రాధా?”

“అది ఎలా చెప్పను. నా వద్ద ఇం కేమీ లేవు - కాని అవసర మొస్తే హృదయపూర్వకంగా సేవ చేయగలను.”

“మిమ్మల్ని వారు చెయ్య నిస్తారా?”

“న న్నెవ్వరూ ఆపలేరు.”

౭

కుమార్ రాలేదని విని విజయుని తల్లిఅనుమానంతో "ఇదేమిమాటరా! పగవాళ్ల ఇంట్లో బిడ్డను వదలిపెట్టి వచ్చావు?" అన్నది.

"పగవాళ్లు పాతాళంలో కెళ్లి దాక్కున్నారు అమ్మా! వాళ్ల నెతుక్కు తీసుకురావటం ఎవరితరం? మీ మనుమడు వాళ్ల పిన్నిదగ్గర వున్నాడు. కొన్నాళ్లున్న తర్వాత వస్తాడు" అన్నాడు విజయుడు.

"అగస్మాత్తుగా వాడికి పిన్ని ఎక్కడినుంచి వచ్చిందిరా?"

"భగవత్ నిర్మితమైన ప్రపంచంలో అగస్మాత్తుగా ఎవరు ఎక్కడనుంచి వస్తారో ఎవరూ చెప్పలేరు అమ్మా! నీ డబ్బూ - దస్కం తీసుకొని పరారయిన గగనచటర్జీ చెల్లెలు ఆమె. ఇంటోంచి ఆమెను గెంటించటానికే లాఠీలను తీసుకొని యుద్ధానికి వెళ్లాము. మధ్యలో మీ మనమడు అంతా గడబిడ చేశాడు" అన్నాడు విజయుడు.

తల్లి గ్రహించి "కుమార్ ఆమె వశమైపోయాడన్న మాట? ఆపిల్లవాణ్ణి బాగా ఆదరించి ప్రేమించి వుంటుంది. చిన్నకొయ్యకు పాపం ఆదరణ ఎక్కడా దొరుకలేదు" అని ఆమె తనస్థితిని గురించి వూహించుకొని ఒక నిట్టూర్పు విడిచింది.

"నేను బైటవుంటూ వుండేవాణ్ణి. ఇంట్లో ఎవ రెవరిని ప్రేమిస్తున్నారో ఆదరిస్తున్నారో నేను కళ్లతో చూడలేదు. తీరా ఇంటికి బైలుదేరబోయేప్పటికి కుమార్ పినతల్లిని వదిలి రానన్నాడు" అన్నాడు విజయుడు.

తల్లి అనుమానం అప్పటికికూడా తొలగలేదు. "పల్లెటూరిపిల్లలు చాలా మాటలు చెబుతూ వుంటారు. నువ్వు వెంట తీసుకురాకపోవటం బాగుండలేదు" అన్నది.

"నువ్వు పల్లెటూరి ఆడపడుచువై యుండికూడా పల్లెటూళ్లను విమర్శిస్తున్నావా అమ్మా? చివరకు నీకు పట్టణపు పిల్లలమీద నమ్మకం కలిగిందా?" అన్నాడు విజయుడు.

"పట్టణపు పిల్లలా? వారి పాదాలకు వేయినమస్కారాలు" అని తల్లి రెండుచేతులు ఎత్తి నెత్తిన కొట్టుకుంది.

విజయుడు నవ్వాడు. "నవ్వుతావెందుకురా! నా దుఃఖం నాకు తెలుస్తుంది. కాని వారికి తెలుసా?" అంటూవుండగానే ఆమెకళ్లల్లో నీళ్లు తిరిగినాయి. "ఇప్పటి వూళ్లు మన మున్నప్పటి వూళ్లా నాయనా? కాలం మారిపోయింది" అన్నదితల్లి.

"చాలా మారిపోయినాయి అమ్మా! మీరు బ్రతికున్నంత కాలం మీ పుణ్యఫలాన అవి అలాగే వుంటాయి. వాటికి ఏమీ లోటురాదు. ఇప్పుడే కొంచెం చూచి వచ్చాను. నీకు అది చూపించటం కష్టమని మనసులో విచారంగా వుంది" అని అతను ఆఫీసుకు వెళ్లిపోయాడు. ఆఫీసు పనుల తొందరవల్లే అతను ఇక్కడికి రావలసివచ్చింది

* * *

సాయంత్రం ఆఫీసు నుంచి వచ్చి విజయుడు అన్నగారింటికి వెళ్లి చూచాడు. వెళ్లి చూచేప్పటికి కురుక్షేత్ర సంగ్రామం జరుగుతూవుంది. వినోదవస్తువు లన్నీ అటూ ఇటూ విరజిమ్మి వున్నాయి. అన్న పడకకుర్చీ మీద కూర్చుని బి

రగా "ఎప్పటికీకాదు! వెళితే ఒక్కదానివే వెళ్లు. అలాంటి సంబంధాన్ని గురించి..." అంటున్నాడు.

అగస్మాత్తుగా విజయుణ్ణి చూడగానే ప్రభకు ఒక్కసారి దుఃఖం పొర్లుకొచ్చింది. "నువ్వు చెప్పవోయ్. వారు అనీతను సితాంశునికి యిచ్చి చెయ్యటానికి నిశ్చయించుకుంటే నాతప్పే ముందో? ఇవ్వాళ సంబంధం ఖాయపడింది. వీరు – నేను వెళ్ల నంటున్నారు. అంటే నన్నుకూడా వెళ్లవద్దనేగా" అన్నది.

అన్న మండిపడ్డాడు. "ఏమంటున్నావు – నీకు తెలి యదు? ఇంతకాలంనుండి మనతో అలాచేయవలసిన అవసర మేమి వచ్చింది?" అన్నాడు.

అసలు విషయ మేమిటో ఒక్కసారిగా తెలుసుకోలేక విజయుడు స్తబ్ధుడైపోయాడు. తర్వాత తెలుసుకోటానికికూడా ఎక్కువసేపు పట్టలేదు. "ఆగు, ఆగు! అసలు ఏమిజరిగిందో చెప్పు? అనీతను సితాంశుఘోష్‌పాల్‌కు యిచ్చి వివాహం చేయటం నిశ్చయమైం దనేగా? ఇవ్వాళే సంబంధం ఖాయ మైందా? "I am thrown completely overboard" అన్నాడు.

అన్న గద్దించుతూ "హూ! ఈవిడకు ఏమీ తెలియనే తెలియ దని చెప్పదలచుకుంది" అన్నాడు.

ప్రభ ఏడుస్తూ "నే నేంచెయ్యను విజయా? అన్నయ్య వున్నాడు. అమ్మవుంది. పిల్లకూడా ఈడు కొచ్చింది. వారు తమమాట పోగొట్టుకుంటూంటే దానిలో నా తప్పే ముంది?" అన్నది.

"వారు మోసకారులూ – పాషండులూ – అబద్ధాల

కోరులూ—ఇదే తప్పు. ఒక వైపున చాటు చాటుగా తంత్రాలు పన్నుతున్నారు. ఇక లోకులు నవ్వుతారు; గుసగుసలాడతారు. నేను క్లబ్బులోకెళ్లి తలెత్తలేను'' అన్నాడు అన్న.

ప్రభ అదే విధంగా దుఃఖితస్వరంతో "అలా ఎక్కడా జరగటం లేదా ఏమిటి? దీనిలో నీవు సిగ్గుపడవలసిన దేముంది?'' అన్నది.

"ఆమె మీచెల్లెలు కాబట్టే నేను సిగ్గుపడవలసివస్తుంది. రెండవది నాఅత్తవారింటి వారంతా మోసకారులు కనుకనూ; దానిలో కూడా ఒకపెద్దభాగం నీకు కూడా వుంది కనుకనూ!''

ఈసారి అన్న మొహంకేసి చూచి విజయుడు నవ్వాడు. కాని వెంటనే అతను వదిన పాదాలకు నమస్కరించి ప్రసన్న వదనంతో "అన్నగారు ఎంతగర్జించినా, నేను కోపగించుకోను; విచారా పడను కాని నిజంగానే దీనిలో నీకు భాగముందంటే నేను నీకు చిరకృతజ్ఞుణ్ణిగా వుంటాను'' అన్నాడు.

మళ్లా అన్నవైపుకు చూచి "నువ్వు కోపగించుకోటం నిజంగా చాలా అన్యాయం అన్నయ్యా! వాడు మాట తప్పినా ఈ విషయంలో అలాంటి దేమీ కాదు. వివాహం బొమ్మలాటేమీ కాదు. సితాంసు ఇంగ్లాండునుంచి ఐ.సి.యస్. ప్యాసయి వచ్చాడు. మరి నేను? ఇక్కడా ప్యాసవలేక పోయాను. ఇంగ్లాండు వెళ్లి అయిదారేళ్లు వున్నా ఒక్కడిగ్రీ కూడా సంపాయించ లేక పోయాను. ఇప్పుడు కలపఅడితిలో కఱ్ఱలు అమ్ముకుంటూ కాలం గడుపుతున్నాను. గౌరవప్రదమైన పదవులూ లేవూ; బిరుదులూలేవు. దీనిలో అనీతేమీ అన్యాయం చెయ్యలేదు అన్నయా!'' అన్నాడు.

అన్న కోపంతో "వెయ్యిసార్లు చేసింది అన్యాయం. నువ్వేమంటున్నావు – నీకేమీ విచారంలేదా?" అన్నాడు.

"నువ్వు పెద్దవాడివి. పూజ్యుడవు. నీతో అబద్ధమాడను అన్నయ్యా. నీపాదాలంటి చెబుతున్నాను. నాకేంవిచారం లేదని, నాపుణ్య ఫలంవల్లకాదుగాని ఏపుణ్యంఫలంవల్ల బైట పడ్డానో తెలియదు. ఏదీ వదినా, నిన్ను నేను తీసు కెళతాను. అన్నయ్య భీష్మించుకొని ఇంట్లో కూర్చుంటే కూర్చోనివ్వు. నువ్వూనేనూ పద! వెళదాం. నీ చెల్లెలిపెళ్లికి కడుపునిండా మెక్కి వద్దాం" అన్నాడు విజయుడు.

ప్రభ అతని మొహం కేసి చూచి "నువ్వు నన్ను నవ్వు లాట పట్టించావా వోయ్"!" అన్నది.

"లేదు వదినా, నవ్వులాట కాదు. ఇవ్వాళ నేను హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను. మీ వరునిలాంటి అదృష్టం నావైపు మళ్లీ తలెత్తిచూడమని. కాని ఇక ఆలస్యం చెయ్యకు. నువ్వు చీరమార్చుకో! నేనుకూడ ఆఫీసు డ్రస్సు మార్చుకు వస్తాను" అని త్వరగా వెళ్లబోతూ వుండేప్పటికి "నీకు ఆహ్వానంలేదు. నువ్వెట్లా వెళతావు?" అన్నాడు అన్న.

విజయుడు వెనక్కి తిరిగి నంచుని "అయితే మంచిదే! వారు సిగ్గుపడివుంటారు. పిలవక పోయినా నాకెక్కడికి వెళ్ల టానికికూడా ఏమీ సంకోచం లేదు. పరుగెత్తుకొని వెళ్లి – నువ్వు నన్ను చేసిన మోసమేమీ లేదు అనీతా! నాకు నీమీ దేమీ కోపంలేదు. కాకలేదు. నువ్వు సుఖంగా వుండ మని నాప్రార్థన – అని అనాలనిపిస్తూవుంది. నామనవి విను

అన్నయ్యా! కోపం వుంచుకోక వదినను తీసుకెళ్లు, కనీసం నా తరఫు నైనా మీ రిద్దరూ అతన్ని ఆశీర్వదించిరండి" అన్నాడు.

అన్నా వదినా ఇద్దరూ స్తబ్ధులై అతని మొహంకేసి చూస్తూ వుండి పోయారు. వారిదృష్టులు విజయుని వదనం మీద పడ్డాయి. అతని మొహంమీద వ్యంగ్యచిహ్నా లేమీ లేవు. క్రోధాభిమానాల ఛాయలు అతని గొంతులో ఈషన్మాత్రం కూడా లేవు. ఏదో మహాపత్తు నుండి బైటపడ్డట్టు వుంది. ఎంతైనా ప్రభ అనీతకు అక్కగా – చెల్లెలికి ఆమె ఈ ఇంగితం వుపదేశ మివ్వలేదు. అభిమానంతో ప్రభహృదయము మండి పోయింది. ఆమె ఏదో చెప్పబోయింది గాని గొంతు నిండు కొచ్చింది. "నా సంగతులన్నీ చెప్పే సమయం ఇంకా రాలేదు. ఎప్పుడైనా వస్తుందో లేదో కూడా తెలియదు. ఎప్పుడైనా వస్తేమట్టుకు నువ్వు అదృష్టవంతుడవు మరదీ! నిన్ను ఆశీర్వదిస్తున్నాను" అని అంటావు. అన్నాడు విజయుడు.







# హరిచరణ్

ఆ సంగతి జరిగి చాల కాలమైంది. షుమారు పదిసంవ వత్సరముల నాటిమాట. అప్పటి కింకా దుర్గాదాసుబాబు వకీలు కాలేదు. దుర్గాదాస్ శర్మను బహుశా నువ్వెరుగుండి వుండవు. కాని నేను బాగా ఎరుగున్నాను. పద! అతనితో నీకు పరిచయం చేస్తాను.

తల్లిదండ్రులు లేని అనాథ కాయస్థబాలకు డొకడు ఎక్కడనుంచి వచ్చి రామదాస్‌బాబు గారింటివద్ద వుండ సాగాడో తెలియదు. పిల్లవాడు మంచివా డని అందరు అంటూ వుండేవారు. అందమైన వాడు, తెలివైనవాడు- దుర్గాదాసు బాబుకు ప్రియమైన నౌకరూను.

చిన్న పెద్ద పన్నులన్నీ అతనే చేయటానికి సిద్ధమౌతాడు. ఆవుకు కుడితి పెట్టటం దగ్గరనుంచి రామదాస్‌బాబు కాళ్లు వత్తటం వరకు పను లన్నీ అతను అతిశ్రద్ధతో చేస్తూ వుండే వాడు. ఎప్పుడు ఏదో ఒక పనిలో నిమగ్నమై వుంటాడు. అదే అతనికి నచ్చుతుంది.

పిల్లవాని పేరు హరిచరణ్. అతనిపని చూచి యజ మానురాలికి ఆశ్చర్యంవేసేది. అప్పుడప్పుడు ఆమె అతన్ని కోప్పడుతూ "ఇంకా నౌక ర్లున్నారుగా హరీ! వారుచేస్తారుగా! నువ్వు పిల్లవాడివి. ఇంత పరిశ్రమచేయటం ఎందుకు?" అనేది. హరిలో ఒక అవగుణం కూడావుంది. అతను తరచుగా నవ్వుతూ వుండేవాడు. నవ్వుతూ "మేము బీద వాళ్లము తల్లీ! పనిపాటలు చేయక ఇంకేం చేస్తాం?" అనేవాడు.

ఈ విధంగా సుఖదుఃఖాలు, ప్రేమ ఆదరాలు, పని పాటలతో హరిచరణ్ షుమారు ఒక సంవత్సరం గడిపాడు.

* * *

సురబాల రామదాసుబాబుకి చిన్నకూతురు. ఆమెకు షుమారు అయిదా రేళ్లవయస్సు వుంటుంది. హరిచరణ్‌తో సురబాల బాగా కలిసిపోయింది. ఇద్దరిలో బాగా పొసగుతుంది. పాలు త్రాగించటానికి తల్లీ బిడ్డల మధ్య ద్వంద్వయుద్ధం జరిగి ఎంత చెప్పినా ఆ చిన్నపిల్ల పాలుతాగనప్పుడు – త్రాగకపోతే ఆయుస్సు తగ్గుతుందనే వ్యాకులంతో మరిడిపడి పిల్లబుగ్గలు సాగదీసినా లాభం లేని పరిస్థితిలో హరిచరణ్ చెప్పగానే త్రాగేది.

చాలా సంగతులు జరిగినాయి. కాని ఇప్పు డవి అనవసరం. హరిచరణ్‌ని సురబాల బాగా ప్రేమిస్తూ వుందని మాత్రం తెలుసుకో.

దుర్గాదాసుబాబు ఇరవైయేళ్ల వయసులో వున్నప్పటి సంగతి చెబుతున్నాను. దుర్గాదాసు అప్పుడు కలకత్తాలోనే చదువుతూ వుండేవాడు. ఇంటికి రావటం అతనికి మహా యాతన – మొదట స్టీమరుమీద ఎక్కటం, తర్వాత పది క్రోసుల దూరం కాలినడకను నడవటం – చాలా పిసుకైన ప్రయాణం.

కొడుకు బి. ఏ. ప్యాసయి వస్తున్నా డని తల్లి చాల హడావుడిగా వుంది. కొడుకు తిండి త్రిప్పలు సరిగా వుండటానికీ, సేవా శుశ్రూషలు చేయటానికి ఇంటిల్లపాదీ చాలా ఆతురతతో వున్నారు.

"ఈ కుర్రవా డెవరమ్మా? "దుర్గాదాసు అడిగాడు." ఒక కాయస్థుల పిల్లవాడు. తలిదండ్రులెవరూ లేరు. అందు కని మీనాన్న దగ్గరకు తీశాడు. పనిపాటలన్నీ చేస్తాడు. చాల బుద్ధి మంతుడు. ఎవ రేమన్నా కోపంలేదు. పాపం తల్లిదండ్రు లెవరూ లేరు. ఇంకా చిన్నతనం – నాకు అతనియందు చాల ప్రేమ!" అన్నది తల్లి.

ఇంటికి వచ్చిన తర్వాత దుర్గాదాసుబాబుకి హరిచర ణ్‌తో ఇదే మొట్టమొదటి పరిచయం.

సరే, ఇప్పుడు హరిచరణ్‌కి చాలా పనులు చేయవలసి వస్తోంది. దీనివల్ల అతనికి సంతోషమే గాని కోపంలేదు. దుర్గా దాసుకి స్నానానికి నీళ్లు తోడటం, అవసరమైనప్పుడు మంచి నీళ్లు తెచ్చిపెట్టటం, సమయానికి ఆకు వక్కలు అందించటం, సిగరెట్లు యివ్వటం – ఈ పనులలో హరిచరణుడు చాల తెలి వైనవాడు. దుర్గాదాసుబాబు కూడా తరచు కుర్రవాడు చాల ఇంటిలి జెంటు అనుకుంటూ వుండేవాడు. గుడ్డలు వుతకటం, మంచినీళ్లు తీసుకురావటం, బూట్లు పాలిష్ చేయటం మొద లైన పనులు అతను చేస్తేగాని దుర్గాదాసుకి నచ్చేవికావు.

* * *

ఎక్కడ నీరు ఎక్కడికి వెళ్లి ఆగుతుందో తెలియదు. జ్ఞాపక ముందా? ఒకసారి మన మిద్దరము ఏడుస్తూ ఏడుస్తూ ఒక దురూహ్యమైన తత్వం చదివాము. అన్ని విషయాలలోనూ అది సరిపోతుం దనిపిస్తూవుంది. ప్రపంచంలో మంచికి మంచి జరుగు తుందా? మంచికి చెడు జరగటం లేదూ? నువ్వు చూడకపోతే రా! చూపిస్తాను. అది మహాదురూహ్య తత్వం.

పైరాసిన సంగతు లన్నీ అర్థం చేసుకోవా లని నేననను. అవసరం కూడా లేదు. నీకు ఫిలాసఫీ వుపదేశించుదా మని కూడా కాదు నావుద్దేశం. అయినా మనలో మనకు రెండు మాటలు చెప్పినా ఇబ్బందిలేదు.

ఇవ్వాళ దుర్గాదాసుబాబు ఏదో పెద్దవిందుకు వెళ్లాలి. ఇంటివద్ద భోజనం చెయ్యడు. తిరిగివచ్చేప్పటికి కూడా చాలా ప్రొద్దుపోతుంది. అందుచేత పని పాటలన్నీ అయిన తర్వాత పండుకో మని చెప్పిపోయాడు.

ఇక హరిచరణ్ సంగతి చెబుతాను. దుర్గాదాసుబాబు రాత్రిపూట బైటగదిలోనే పండుకుంటూ వుంటాడు. దానికి కారణం అందరికీ తెలియదు. భార్య కన్నవారింటికి వెళ్లి పోయిన తర్వాత బైట పండుకోటమే అతనికి నచ్చిం దని నావుద్దేశం.

రాత్రిపూట చిన్నబాబు (దుర్గాదాస్)కు పక్క వెయ్యటం, పండుకున్న తర్వాత అతని కాళ్లు వత్తటం మొదలైన పనులన్నీ హరిచరణ్ బాధ్యతలో వున్నాయి. అతను బాగా నిద్రపోయిన తర్వాత హరిచరణ్ ఎదురుగా వున్న కొట్లోకి వెళ్లి పండుకునేవాడు.

హరిచరణ్‌కి సాయంత్రమే తలనొప్పి ప్రారంభించింది. జ్వరం వస్తుం దని అతను గ్రహించాడు. మధ్య మధ్య అప్పు డప్పుడూ అతనికి జ్వరం వస్తూవుండేది. అందుచేత అతనికి దాని పూర్వలక్షణాలతో బాగా పరిచయం వుంది. హరిచరణ్ కూర్చోలేక పోయేప్పటికి వెళ్లి పండుకున్నాడు. చిన్నబాబు గారికి ఇంకా పక్క వేయవలసివుం దని అతనికి జ్ఞాపక మే లేదు.

ర్మాత అంతా భోజనానికి వచ్చారు. కాని హరిచరణ్ రాక పోవటంచూచి అతని అమ్మగారు చూట్టానికి వచ్చింది. వంటి మీద చెయ్యివేసి చూచింది. చాల వేడిగా వుంది. జ్వరం వచ్చిం దని తెలుసుకొని ఇంకెక్కువ బాధించకుండానే వెళ్లి పోయినది.

ర్మాతి షుమారు పన్నెండు ఒంటిగంట అవుతుంది. విందు ఆరగించి చిన్నబాబు ఇంటికి వచ్చిచూచాడు. పక్క లేదు. ఒకనైపున నిద్ర పడదోసుకు వస్తూ వుంది. ఇంటి కెళ్లి మత్తుగా పండుకుందాం— హరిచరణుడు బూట్లుతీసి అలసివచ్చిన పాదాలను మెల్లగా వత్తుతూ వుంటాడు. పుష్టిగా నిద్రపోయి తెల్లవారి కన్ను తెరుద్దా మని దారిపొడుగునా ఆలోచించు కున్నాడు.

ఒక్కసారి నిరాశజెంది చాల మండిపడ్డాడు. కోపం తోనే, "హరీ! ఓహరీ!" అని రెండుమూడుసార్లు పిలిచాడు. హరి వుంటేగా పలకటానికి. పాపం జ్వరంతో స్పృహలేకుండా పడివున్నాడు. గదిలోకి వెళ్లి చూచాడు — నిజంగా కప్పుకొని పడుకొని వున్నాడు.

ఇక సహించలేకపోయాడు. జుట్టు గట్టిగా పట్టుకొని కూర్చొబెట్టటానికి ప్రయత్నించాడు. కాని అతను అలాగే పడివున్నాడు. ఇక బాబు క్రోధావేశంతో విచక్షణాజ్ఞాన శూన్యుడై హరిచరణ్ వీపుమీద బూటుకాలితో రెండు తన్నులు తన్నాడు. ఆ తన్నులకు అతను లేచి కూర్చున్నాడు.

"దుర్గాదాసుబాబు! చిన్నపిల్లవాడిలాగ పడి నిద్రపోతు

న్నాను; పక్క నేను వేయనా?" అంటూ వుండగానే అతని క్రోధం పెరిగిపోయి రెండుమూడు బెత్తపు దెబ్బలు వేశాడు.

రాత్రి హరిచరణుడు పాదాలొత్తుతున్నప్పుడు మాత్రం వేడినీటి చుక్కలు అతని కాళ్లమీద పడినాయి.

*   *   *

రాత్రంతా దుర్గాదాసుబాబుకు నిద్రరాలేదు. ఆ నీటి బిందువులు అతనికి చాల వేడిగా తగిలినాయి. హరిచరణుని అతను చాల ప్రేమిస్తూ వుండేవాడు. అతని వినయం మూలంగా అతనే కాదు, అందరికీ ప్రేమపాత్రు డయ్యాడు. విశేషంగా ఈ నెలరోజుల పరిచయాన్ని బట్టి అతనికి మరింత ప్రేమపాత్రుడై పోయాడు.

రాత్రి అతను ఒకసారి చూచి వద్దాం, ఎక్కడ తగిలినాయో, ఏమో? అనుకున్నాడు. కాని నౌకరుగా! అతను వెళ్లటం బాగుంటుందా? వెళ్లి జ్వర మేమైనా తగ్గిందా అని అడుగుదా మని అనేకసార్లు అనుకున్నాడు. కాని అతనివద్ద కెళ్లటానికి సిగ్గుగా తోచింది. ప్రొద్దున్నే హరిచరణ్ బాబు గారు మొహం కడుక్కోటానికి నీళ్లు తెచ్చి యిచ్చాడు. దుర్గాదాసుబాబు అప్పుడైనా అడిగితే, ఒకటి రెండు ఓదార్పుమాటలంటేం? వాడింకా కుర్రవాడు. వాడి వయస్సెంత వుంటుంది- పదమూడేళ్లు కూడా వెళ్లలేదు. పిల్లవా డనుకునే - ఒకసారి దగ్గరకు పిలచి-దెబ్బలు ఎక్కడ తగిలినాయో-వాతలు ఎక్కడ తేలినాయో - బూటుదెబ్బ తగిలిందో చూస్తేం? కుర్రవాడేగా! ఇంత సిగ్గుపడవలసిన అవసర మే మొచ్చింది ?

షుమారు తొమ్మిది గంటలకు ఎక్కడనుంచో తంతి

వచ్చింది. తంతి సంగతి అనగానే దుర్గాదాసు బాబు హృదయ తంత్రులు ఆగిపోయినాయి. కొంచెం గాబరాపడ్డాడు. చించి చూచాడు. భార్యకు చాల జబ్బుగా వుంది. ఒక్కసారిగా అతనిగుండె దడదడలాడింది. ఆ రోజునే అతను కలకత్తా వెళ్ల వలసివచ్చింది. బండి ఎక్కినతర్వాత-ప్రాయశ్చిత్తం చేయటం లేదుగదా భగవంతుడా! అనుకో సాగాడు.

షుమారు ఒక నెల గడచిపోయింది. దుర్గాదాసు మొహం చాల సంతోషంగా వుంది. అతని భార్యకు ఒక కొత్తజన్మ వచ్చిందే అనుకో - చావునుంచి బ్రతికింది. ఇవ్వాళ పథ్యం తీసుకుంది.

ఇంటిదగ్గరనుండి ఇవ్వాళ ఒక వుత్తరం వచ్చింది. దుర్గాదాసు బాబు తమ్ముడు రాశాడు. దానికింద 'మరియు' అని - చాల దుఃఖకరమైన విషయం. నిన్న వుదయం పది రోజులు జ్వరంలో వుండి హరిచరణుడు చనిపోయాడు. చని పోయేముందు అనేకసార్లు మిమ్ముల్ని చూడా లని కలవరిం చాడు అని వ్రాశాడు.

పాపం తలిదండ్రులు లేని అనాథబాలుడు.

దుర్గా దాసుబాబు వుత్తరం ముక్కలు ముక్కలుచేసి పారేశాడు.

---

67

# అరుణ ప్రచురణలు

| | |
|---|---|
| బిందుగారబ్బాయ్: శరత్ బాబు-వేలూరి శివరామశాస్త్రిగారు | 0-12-0 |
| ఎక్కడికి - ఇతరకథలు : ముద్దుకృష్ణ | 0-12-0 |
| ప్రతిమాసుందరి : నాటిక | 0-10-0 |
| విడాకులు : చలం | 1-0-0 |
| అంతరాత్మ : విశ్వనాథ సత్యనారాయణగారు | 1-0-0 |

## ఇతర పుస్తకాలు

శరత్ కథలు—

| | |
|---|---|
| చరిత్రహీనులు 2 భాగాలు | 5-0-0 |
| శరత్ కథలు | |
| సుభద | |
| పండిట్ జీ | 1-0-0 |
| బాబూరాజేంద్ర ప్రసాద్ | 0-8-0 |
| మేనరికం (కథలు) | 0-6-0 |
| మాణిక్యం ,, | 0-8-0 |
| కథలు—గాథలు : (పద్యం) వేలూరి శివరామశాస్త్రిగారు | 1-0-0 |
| ఏకావళి : శివరామశాస్త్రిగారు | 1-0-0 |

ఇవిగాక వేలూరు శివరామశాస్త్రిగారు, విశ్వనాథ సత్యనారాయణగారు, చలం, చక్రపాణి, కొడవటిగంటి, ధనికొండ, మొదలైన వారికథలు వగైరాలు, నవ్యసాహిత్యంకు మాకు వ్రాయండి.

వెరైటీ ఏజన్సీస్,
పబ్లిషర్సు & బుక్ సెల్లర్సు,
గవర్నరుపేట—బెజవాడ.

66







Variety Agencies, Bezwada

| | | | |
|---|---|---|---|
| **Book Number** | AA/01A 108 | **Date** | 22/09/2021 |
| **Front Cover** | yes | **Back Cover** | yes |
| **Blank Pages** | CI, 65 | | |
| **Missing Pages** | NO | | |
| **Prepared** | B. Sandhya | **Scanned** | K. Daveeo |
| **BOOK SIZE** | H 7.1 W 4.9 | **Pages** | 72 |

